## గంటల పంచాంగం

వ్యయ సం॥ ఆషాఢ శు॥ సప్తమి
1946 సం॥ జూలై 5 శుక్రవారం
శు॥ సప్తమి రా 10-15 ఉ ఫ ప 2-43 వర్జ్యం రా 11.42 ల 1-25 కు.

శు॥ అష్టమి జూలై 6 శనివారం
శు॥ అష్టమి రా 11-29 హ ప 4-24 వర్జ్యం రా 1-10 ల 2-55 కు.


# ఆంధ్రపత్రిక

వ్యయ సం॥ ఆషాఢ శు॥ సప్తమి
శుక్రవారము


## విభిన్న దృక్పథములు

భారతీయులు తమంతట తాము నూతన రాజ్యాంగ స్వరూపమును నిర్ణయించుకొనుటకు అవసరమైన సాధన విధానములను ఏర్పాటు చేయుటకు, రాజ్యాంగము అమలులోనికి వచ్చువరకు ఉండవలసిన నడమంత్రపు ఏర్పాట్లు చేయుటకును గాను వచ్చిన బ్రిటిషు మంత్రిత్రయ రాయబార ఫలితము 4 వ తేదీ నుండి కేంద్రమున పూర్తిగ ఉద్యోగులతో కూడిన ప్రభుత్వస్థాపన. సర్వసేనాధిపతితో చేర్చి ఈ ప్రభుత్వసభ్యుల సంఖ్య ఎనిమిది. ఇద్దరు తప్ప మిగిలినవారందరు యూరోపియనులు. దీనివల్ల కేంద్ర ప్రభుత్వ రూపము మింటో-మోర్లే సంస్కరణల నాటికి పోయినది. పూర్తిగా ఉద్యోగులతో నిర్మించుటవల్ల ముందు మార్పుకు (కార్యమునకు) కట్టుబడినట్లని శ్రీ రాజగోపాలాచారిగారనుచున్నారు. ఆ కట్టుబాటుయొక్క పటుత్వము ప్రభుత్వమును పైవిధముగ నిర్మించుట మూలమున ఎక్కువైనదని చెప్పుటకు వీలులేదు. రాజప్రతినిధి, మంత్రివర్గ వాగ్దానముల కన్న ఇది ఎక్కువదని చెప్పుటకూ వీలులేదు. ఒక అసంతృప్తికరమైన పరిస్థితికి కేవలము యుక్తివాదముతో సంతృప్తికరమైన అర్థమును శ్రీ రాజగోపాలాచారిగారు తీయుచున్నారు. ఒకటి ప్రభుత్వస్థాపన మరొక ప్రభుత్వ శీఘ్రాగమనమునకు సంజ్ఞ కాజాలదు. ఉద్యోగులతో కూడిన ఈ ప్రభుత్వము ఎంత శీఘ్రము అంతమగునన్నదే అసలు ప్రశ్న.

జూన్ 26 న రాజప్రతినిధి, మంత్రిత్రయము తాత్కాలిక ప్రభుత్వ నిర్మాణ ప్రయత్నము ప్రస్తుతానికి విరమించుతూ చేసిన ప్రకటన ఈ విధముగ తెలుపుచున్నది. "ఇంతవరకు తాత్కాలిక ప్రభుత్వస్థాపన సాధ్యము కాలేదు. కాని జూన్ 16 ప్రకటన 8 వ పేరా ననుసరించి ప్రయత్నములు సాగించ కృతనిశ్చయులై యున్నారు." అయితే గతమూడు మాసాలుగా రాజప్రతినిధి రాజకీయపక్ష ప్రతినిధులు వహించిన భారమును చూచి, "రాయబారములు కొంత కాలము వరకు వాయిదా వేయబడినవి. ఈలోపల రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలు జరుపబడును." అని తెలిపిరి. కాని పరిషత్తు ఎన్నికలు జరుపుటకు తాత్కాలిక ప్రభుత్వ నిర్మాణమును వాయిదా వేయలేదు. కాంగ్రెసు కార్యవర్గము, లీగు కౌన్సిలు దీర్ఘకాల ప్రతిపాదనల నంగీకరించుటచేత పరిషత్తు ఎన్నికలను సాగించదలచిరి. అవి ముగిసిన తరువాత తిరిగి ప్రయత్నము జరుగునని విస్పష్టము చేయలేదు. "చర్చలు ప్రారంభమైనపుడు" (తాత్కాలిక ప్రభుత్వ నిర్మాణమునకు, "రెండుపక్షములు తమ భేదాభిప్రాయములను సర్దుబాటు చేసికొనుటకు తమ శక్తికొలది ప్రయత్నిస్తారని నమ్ముచున్నాము" అని నూత్రము తెలిపిరి. ఈ "కొద్ది కాలము వాయిదా" యొక్క పరిమితిని ఎవరికి తోచినట్లు వారు అన్వయము చేసికొనవచ్చును. అమాత్య రాయబారము భారతదేశమునకు రాకముందు ప్రభువుల సభలో ప్రసంగించుచూ, తాత్కాలిక ప్రభుత్వస్థాపన, "రాజ్యాంగ పరిషత్తు తన కార్యనిర్వహణలో నిమగ్నమై యున్నపుడే ప్రధాన పక్షములతో కూడిన రాజప్రతినిధి కార్యవర్గము నేర్పాటుచేయవలెనని అభిప్రాయము." అని ఫిబ్రవరి 19 న లారెన్సుప్రభువు తెలియజేసెను. ఇపుడు నాటి ప్రకటననే అనుసరించి వ్యవహరించవచ్చును. అంతేకాక జూన్ 16 ప్రకటనలోని పద్ధతికూడ పనికిరాదు.

అసలు రాజ్యాంగ పరిషత్తు అడ్డంకులులేక "కార్యనిర్వహణలో నిమగ్నమగుటకు" సాధ్యమా అనునది అనుమానాస్పదమే. దీర్ఘకాల ప్రతిపాదనలను కాంగ్రెసు లీగు అంగీకరించినవని తాము వచ్చిన పని "సగము పూర్తి అయినద"ని మంత్రిత్రయములో ఒకరైన ఎ. వి. అలెగ్జాండరుగారు చెప్పిరి. "సంతృప్తికరమైన తాత్కాలిక ప్రభుత్వస్థాపన జరిగితేనే" మే 16 పథకమును అంగీకరించుచున్నామని కాంగ్రెస్ కార్యవర్గము చెప్పినదని వీరు గుర్తించినట్లు లేదు. దీనికి తోడుగ 16 మే పథకమును, మంత్రిత్రయము, లీగు, కాంగ్రెసు ముగ్గురు మూడు వైఖరులలో అంగీకరించిరని కూడ వీరు గుర్తించవలసియున్నది. 16 మే ప్రకటన పాకిస్థానను తిరస్కరించినది. పాకిస్థాన విత్తనముండి, విభజనకు సాధ్యమున్నదని లీగు కౌన్సిలు ఆ పథకమును అంగీకరించినది. ఆదిలోనే రాష్ట్రకూటాయింపుకు పథకములోని అంశములే విరుద్ధముగ నున్నవని కాంగ్రెసు చెప్పుచున్నది. "తమ ఉద్దేశములు" కాంగ్రెసు వ్యాఖ్యానము సమన్వయము అవుటలేదని మంత్రిత్రయము రాజప్రతినిధి తెలిపిరి. రాజ్యాంగపరిషత్తు సర్వస్వతంత్రమను కాంగ్రెసు అర్థమును మైనారిటీ రక్షణలకు సంబంధించినంతవరకు కాదని చెప్పిరి. యూరోపియనులకు పరిషత్తు ఎన్నికలతో సంబంధ ముండకూడదను వాదమును కాంగ్రెసు సాధించినది. దీనికి తోడుగ ఆయా సెక్షనులుగ కేటాయింపబడిన రాష్ట్ర ప్రతినిధులు ప్రథమముననే వర్గసమావేశములకు అంగీకరించుచున్నామను ప్రమాణమును ఉపసంహరింపచేయగలిగినది. కాని ఇందువల్ల వచ్చెడి ప్రయోజనము స అభిప్రాయభేదమున్నది. 16 మే ప్రకటన భారతీయపక్షముల కు ఏకీభావము కుదరనందున బ్రిటిషువా రిచ్చిన పథకము. దానిలో వారు రాష్ట్రములను భిన్న భిన్న సెక్షనులుగా ఏర్పరచుటను "కారణములు" అనదగినవే అనుచున్నారు. ఆ ప్రకటనకు అర్థము చెప్పవారు కూడ వివిధ రాజకీయపక్షములకు సంతృప్తి కలుగజేయు సిద్ధాంతమును, సూత్రములను కలిపి నిర్మింపబడినపుడు వాటిని కాదనగలరా?

అందువల్లనే కాంగ్రెసు కార్యవర్గము దీర్ఘకాల ప్రతిపాదనల ఆమోదము, ఒక సందిగ్ధస్థితిమీద ఒక అసందిగ్ధనిర్ణయము చేసినదని వ్రాసియుంటిని. కాంగ్రెసు ఆశయసిద్ధికి సాధ్యమున్నదని తలచినట్లే లీగు కూడ తలచుచున్నది. ఇద్దరు అదే విశ్వాసముతో బ్రిటిషుపథకమును ఆమోదించి పరిషత్తులో పాల్గొననున్నారు. వీరిద్దరికి భిన్నమైన దృక్పథముతో బ్రిటిషు ప్రభుత్వమున్నది. కాబట్టి ఇట్టి పరస్పర విరుద్ధమైన భావములతో సంకల్పములతో పరిషత్తులో పాల్గొనబోవుచున్నారు. అట్టి సందర్భములో నిరోధములు ప్రతిష్టంభనలు తప్పవు. అరబుల యూదుల కోర్కెలను సంతృప్తిపరచుటకు బ్రిటిష్‌వారు ప్రథమ సంగ్రామానంతరము నాటినుండి అవలంబించిన విధానఫలితము నేడు పాలెస్తీనాలో అందరు చూచుచున్నారు. ద్వితీయ సంగ్రామానంతరము అదేవిధమైన ప్రమాదకరమైన పొరబాటును భారతదేశములో చేయుచున్నారని తోచకమానదు. మూడు మాసములు ఢిల్లీలో రాయబారములు, చర్చలు, సమాలోచనలు జరిపిన మంత్రిత్రయమునకు ఈ అంశములు తట్టినదో లేదో తెలియదు. భారతీయులు తమలో తాము కలహించవచ్చును. గాని భారతదేశము అవిభాజ్యమని వారు గ్రహించవలసియున్నది.

రేపు బొంబాయిలో సమావేశమగుచున్న అ. భా. కాంగ్రెస్ సంఘములో చర్చ సందర్భమున ఈ భావములు ప్రస్ఫుటమవకమానవు. అతివాద దృక్పథముగల యువకవర్గమునకు తమ నిర్ణయమును నచ్చచెప్పుటలో కార్యవర్గ అభిప్రాయము విశదము కాగలదు.

## ప్రజా పరిషత్ బాధ్యత

1 వ పేజీ తరువాయి

నంలో నిరుద్యోగసమస్య ఏమైనా పరిష్కారమవుతుందేమోగాని, అంతకుమించి మరేమి కావలసిన మిగతా ఫలితాలేవీ చేకూరే అవకాశం వుండదు. యూనియన్ ఆర్థికసమస్యకూడా మరొక చిక్కు సమస్య.

బ్రిటిషు మంత్రిత్రయం సూచించిన ఇండియా యూనియన్ స్థాపనపథకం, భారతదేశాన్ని విభజించాలనే, విభజించకూడదనే రెండు వాదనలకు సమన్వయపథకం దేశవిభజన కావాలనేవారు అసలు కేంద్రప్రభుత్వమే వుండకూడదన్నారు. అనవా అట్టి కేంద్రప్రభుత్వం ఏర్పడినా, దానికి పన్నులువిధించే అధికారం పనికిరాదని తీవ్రమైన ఆక్షేపణలు తెలియజేశారు. కొబట్టి ప్రజాపరిషత్తు సమావేశాలలో దేశ విభజనవాదులు కేంద్రప్రభుత్వ పన్నులవిధింపు అధికార విస్తరణకు బహుశా ప్రతిఘటించనే ప్రతిఘటించరు.

కేంద్రప్రభుత్వం తగిన ఆర్థిక సహాయాన్ని అందజేసేపద్ధంలో దేశాభివృద్ధికార్యక్రమాలను నిర్వహించడానికి రాష్ట్రప్రభుత్వాలు సర్వదా సంసిద్ధంగానే వున్నవి. ఐతే ఈ ఆర్థిక సహాయాలదే పెద్దసమస్య. యూనియన్ ప్రభుత్వంకద్ద ఏదైనా మిగులు, దక్కుంపు ఉంటే రాష్ట్రాలకూ, యూనియన్‌కూ మధ్య సహకార స్థాపనసాధ్యం. ప్రస్తుత రాజకీయ వైరుధ్య పరిస్థితులలో ఆర్థిక సదుపాయాల లభ్యం కావటం చాలా అనుమానాస్పదమైన విషయం.

కార్మిక, వాణిజ్య, వ్యాపార శాఖలలో రాష్ట్రాలకూ, కేంద్రానికీ మధ్య సహకార సహాయపద్ధతి వుండటం న్యాయసాధ్యం, ఆరోగ్య, విద్యాశాఖల విషయంలో కంటే ఈ దానుఖ్యం. ఒక్కొక రాష్ట్రం ఒక్కొక టారిఫ్ పద్ధతిని అనుసరించుటవల్ల వివిధ రాష్ట్రాలమధ్య, రాష్ట్రాలకు, గ్రూపులకూ మధ్య సంఘర్షణ ఏర్పడటం సహజం.

ఇప్పటివరకూ 'ప్లానింగ్' కేంద్రప్రభుత్వ ఆధ్వర్యం కిందనే సాగుతూవచ్చింది. దాన్ని ఇప్పుడు రద్దుచేసేశారు. బ్రిటిష్ అమాత్యత్రయ పథకం ప్రకారం కేంద్రప్రభుత్వానికి ఈ శాఖపై అధికారం వుండదు కాబట్టే, ఇలా రద్దుచేయడం జరిగివుంటుంది. తాత్కాలిక జాతీయ ప్రభుత్వం ఏర్పడిన తర్వాత గాని, ప్లానింగ్‌ను కేంద్రప్రభుత్వ యాజమాన్యం కిందనే సాగించడం ఎంతవరకు శ్రేయస్కరమనే విషయం నిర్ణయం కాదు. యూనియన్ ప్రభుత్వాధికారాలను విస్తరించడం ఎంతవరకు యుక్తమనే విషయాన్ని నిర్ణయించవలసింది ప్రజాపరిషత్తే. రాష్ట్రాలకూ, యూనియన్ ప్రభుత్వానికీ మధ్య సహకార విధానం ఎంతవరకు వుండవచ్చుననే అంశాన్ని కూడా పరిషత్తే తేల్చవలసి వుంటుంది.

## ఆజాద్, గఫర్ ఖాన్

పెషావరు, జూలై 3: ప్రజాపరిషత్తుకు సరిహద్దురాష్ట్రం ప్రతినిధులను ఎన్నుకునే విషయమై ప్రధాని డా॥ ఖాన్‌సాహెబుగారికి ఆచార్య కృపలానీ (అఖిలభారత కాంగ్రెస్ కార్యదర్శి) గారి వద్దనుంచి వర్తమానమొచ్చింది. మౌలానా ఆజాద్, గఫర్ ఖాన్ గారలు సరిహద్దురాష్ట్రం కాంగ్రెస్ ప్రతినిధులుగా ప్రజాపరిషత్తుకు నిలుస్తారు. మూడవసభ్యుడిని ముస్లింలీగు ఎం. ఎల్. ఏ. లు ఎన్నుకుంటారు. ముస్లింలీగు పార్లమెంటరీబోర్డువారు నేడు అలహాబాదులో సమావేశమవుతున్నారు. వీరు ఒక అభ్యర్థి పేరును నిర్ణయించి లీగ్ హైకమాండుకు పంపుతారు. సరిహద్దురాష్ట్రమైనారిటీలకు ప్రజాపరిషత్తులో తగిన ప్రాతినిధ్యం ఇవ్వడానికిగాను, సరిహద్దురాష్ట్ర ఆర్థికమంత్రి మెహర్చంద్ ఖన్నాగారిని కాంగ్రెస్ హైకమాండ్ పంజాబు రాష్ట్రంనుంచి ప్రతిపాదిస్తున్నది. జూలై 10 వ తేదీలోపుగా దాఖలు కావలసిన నామినేషన్లను మౌలానా ఆజాద్‌కు పంపారు. గఫర్ ఖాన్‌గారు ఇప్పుడు శ్రీనగరులో వున్నారు. జూలై 8 నాటికి పెషావర్‌కు వస్తారు.

## బీహారు ప్రతినిధులు

పాట్నా, జూలై 3 : బీహారు శాసనసభ సెలెక్షన్ కమిటీవారు ప్రజాపరిషత్తుకు ఈ కిందివారిని ఎన్నుకున్నట్లు తెలుస్తున్నది: 1. సరోజినీదేవి 2. లాలా దేశబంధుగుప్త 3. డా॥ పి. కే. సేన్ 4. డా॥ రాజేంద్రప్రసాద్ 5. బలదేవ్ సహాయ్ 6. బిపిన్ బిహారీవర్మ 7. సత్యనారాయణసిన్హా 8. రామనారాయణ సింగ్ 9. బనార్సి ప్రసాద్ 10. జాన్ జూన్‌వాలా 11. జయప్రకాశ్ నారాయణ 12. శ్రీకృష్ణసిన్హా 13. అనుగ్రహనారాయణసిన్హా 14. కృష్ణవల్లభసహాయ్ 15. జగ్‌లాల్ చౌదరీ 16. వినోదానందఝా 17. రామచరిత్రసింగ్ 18. జగ్‌జీవన్‌రామ్ 19. చంద్రికరమ్ 20 భగవత్ ప్రసాద్ 21. బొనిఫేస్ కార్కా 22. అమియ కుమార్ ఘోష్ 23, ఫులన్ ప్రసాదవర్మ 24. జగత్‌నారాయణలాల్ 25. సారంగధర్‌సింగ్, ఈ పేర్లను కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు ఆమోదంకోసం పంపించారు. (యు. ప్రె.)

## విజయలక్ష్మి పండిట్,

లక్నో, జూలై 3: యు. పి. స్థానిక శాఖా మంత్రిణి శ్రీమతి విజయలక్ష్మి పండిట్ శ్రీమతి సుచేతాకృపలానీగారలను రాజ్యాంగ పరిషత్తుకు అభ్యర్థులుగా యు. పి. నుంచి ఎన్నుకోవలసిందిగా కాంగ్రెసు వర్కింగ్ కమిటీవారు ఆల్ ఇండియా వుమెన్స్ కాన్ఫరెన్సువారిసలహాను అనుసరించి ఆమోదించేటట్లు రూఢిగా తెలుస్తూ ఉంది.

## యు. పి. ముస్లింలీగు పార్టీ

లక్నో, జూలై 3 : యు. పి. శాసనసభా ముస్లింలీగు పార్టీ సభ్యులు రాజ్యాంగపరిషత్తుకు అభ్యర్థులను నిర్ణయించి ముస్లింలీగు పార్లమెంటరీ బోర్డువారికి తెలియజేసేటందుకు ఈరోజు సమావేశమయినారు. చౌదరి ఖాలీకుజ్జమాన్ పార్టీ నాయకుడు అధ్యక్షత వహించినారు. పార్టీవారి అభిప్రాయాన్ని తెలుసుకొని పార్లమెంటరీ బోర్డువారే అభ్యర్థుల పేర్లను తేల్చ యాలని నిర్ణయించుకొన్నారు. పార్టీవారు గవర్నమెంటు ఆఫీసులలో ధాన్యసంగ్రహణాన్ని గురించి కూడా చర్చించినారు.

## అస్సాము అభ్యర్థులు

గౌహతి, జూలై 3: అస్సాము రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీ కార్యవర్గమువారు ఈనాడు కాంగ్రెసు భవనములో మౌలానా మహమ్మద్ తైయుల్లా అధ్యక్షత వహించిన సమావేశమును అయినారు. రాజ్యాంగ పరిషత్తుకు అభ్యర్థులను ఎన్నుకొనే విషయము చర్చించినారు. అభ్యర్థుల నిర్ణయము చేయడానికి సర్దెల్లోయ్ సభ్యులలో నూ ఒక అధ్యక్షుడికోనూ ఒక బోర్డును నియమించదలచినారు. అస్సాము సభ్యులలో ఇద్దరు సభ్యులను అస్సాములోయను సంబంధించిన శాసన సభా సభ్యులు యొన్ను కొనేట్లున్నూ మరి యిద్దరు సభ్యులను సురమాలోయను సంబంధించిన సభ్యులు యొన్నుకొనేట్లున్నూ నిర్ణయించినారు. ఈబోర్డుకు అస్సాం కాంగ్రెసు పార్టీ నాయకుడు గోపీనాథ బార్డోలాయి అధ్యక్షుడుగా ఉంటాడు.

## యన్. శివరాజ్ పోటీ

తెంపఫారు, జూలై 3: మద్రాసు మేయరు యన్. శివరాజ్‌గారు రాజ్యాంగ పరిషత్తుకు మద్రాసు రాజధానినుంచి పోటీ చేయదలచినారు.

# ఢిల్లీ రాయబారాలలో కాంగ్రెస్ విజయం

### లూయిస్ ఫిషర్

హిరోషిమా, నాగసాకి దీవులపై ఏటంబాంబు ప్రయోగం భారతీయులలో బహుసంఖ్యాకులకు చాలా బాధకలిగించింది. ఆసియాలో ఇతరత్రా తీవ్ర మనస్తాపానికి కారణమైంది.

"జపాన్ ప్రజలు ఆసియావారు కనుకనే అమెరికా ఇలా ఏటం బాంబును ప్రయోగించింది." అని ఒక భారత నాయకుని నిశ్చితాభిప్రాయం. ఆయన ఆ అభిప్రాయాన్ని మార్చుకునేలా చేయడం ఎవరికీ సాధ్యంకాదు. "శ్వేతజాతిదేశం - జర్మనీమీద అమెరికా ఏటంభాంబును ప్రయోగింప సాహసింపలేదు." అని కూడా ఈ నాయకుని నమ్మకం.

నేను గాంధీజీని కలుసుకున్నప్పుడు భారతదేశంలో లక్షలమంది క్షామబాధకు ఆహుతికానున్న సమయంలో శత్రుదేశమైన జపాన్‌కు ఆహారపదార్థాలు పంపడం సబబా అని అడిగాను. నిస్సంకోచంగా ఇలా జవాబు ఇచ్చాడు: "జపాన్ రాజకీయవేత్తలన్నా, వారి సైనిక పరిపాలనా పద్ధతి అన్నా నాకెప్పుడూ సానుభూతి లేదు. కాని ఆహారపదార్థాల అవసరం భారతదేశానికన్నా జపాన్‌కు ఎక్కువే అయితే- వాస్తవ విషయాలు నాకు తెలియవు- అమెరికా ముందు జపాన్ ప్రజలకే ఆహారపదార్థాలు పంపించితీరాలి. జపాన్ ఆత్మను నాశనంచేయడానికి అమెరికా ప్రయత్నించింది. అందుకే అమెరికా జపాన్ ప్రజల పోషణబాధ్యతవహించి తీరాలి." ఇలా చెప్పి క్రిందటి సంగ్రామంలో ఏటంబాంబు ప్రయోగాన్ని తీవ్రంగా నిరసించాడు.

* * *

బ్రిటిషు పాలకుల దీర్ఘ ఆక్రమణ ఫలితంగా భారత ప్రజల ఉద్రిక్తులై ఉన్నారు. ఈ క్షోభతో ఈ ఉద్రేకం కలసి బ్రిటిషు వారియెడల ద్వేష తవిధానం నిర్ణయమవుతున్నది. అయితే ఒక్క బ్రిటిషువారే ఈ ద్వేషానికి గురి కావడంలేదు. డచ్, అమెరికా, ఫ్రాన్సు సామ్రాజ్యాలపైకూడా భారతీయులకు ద్వేషం ఉంది. తెల్లవారి అహంకారమే తెల్లవారికి సామ్రాజ్యాలను సంపాదించి పెట్టినది. ఈ సామ్రాజ్యాలు అస్తమించినా ఈ ద్వేషభావం, ఈ ఆగ్రహం, చాలాకాలంవరకూ అలాగే ఉంటుంది.

సరిహద్దు గీతలవల్ల, వర్ణవిభేదాలవల్లనేకాక మత విభేదాలవల్ల ప్రపంచం విభాగం అవుతూఉంటే మన ఈ ప్రపంచం ఎన్నటికీ ఒక ప్రపంచంకాలేదు. దేశాభిమానం, జాతి విద్వేషం, రాజకీయమతాలు ఇన్నాళ్ళుగా యుద్ధాలకు దారితీస్తూ ఉన్నాయి. ఇకముందు అయినా ప్రాక్, పశ్చిమాలు వీటిని నివారించునని అంతా ఆశిస్తున్నారు.

* * *

విధానాలను వ్యతిరేకించడము, ప్రభుత్వాలను ప్రతిఘటించడము ఒకొక్కప్పుడు అవసరమవుతుంది. అది ఎప్పుడూ ప్రతివారి హక్కు. రక్తసంబంధాలు, మత వ్యవహారాలు ప్రజల సంబంధ బాంధవ్యాలను నిర్ణయించడం అమానుషమే గాక ప్రమాదకరంకూడా.

* * *

ఢిల్లీలో బ్రిటిషు మంత్రిత్రయము, కాంగ్రెసు లీగు ప్రముఖులతో జరుపుచుండిన రాయబారాలను నేను ఆద్యంతంతో పరిశీలించుచూ వచ్చాను. ఈరాయబారాలు క్రిందటి మార్చిమాసంలో ప్రారంభమై కరి భాగం అమాత్యత్రయం లండన్ బయలుదేరడంతో ముగిసినవి. త్రిపక్ష ప్రతినిధులు అనేక విషయాలను చర్చించారు. ఎన్నో పత్రాలను పరిశీలించారు. క్రొత్త కార్యవర్గ సభ్యుల జాబితాలను పరిశీలించారు. క్రొత్త కార్యవర్గ సభ్యుల జాబితాలను గురించి కూడా దీర్ఘాలోచనలు చేసారు. ఒకరికొకరు ఉత్తరాలు వ్రాసుకున్నారు. స్వయంగా కలుసుకుని మాట్లాడుకున్నారు. ముస్లింలీగువారు స్వతంత్ర భారతరాజ్యాంగనిర్మాణమునకూ, ఈలోపున-రాజ్యాంగ నిర్మాణ వ్యవహారం జరుగుతూ ఉండగా- ఏర్పడవలసిన తాత్కాలిక ప్రభుత్వ స్థాపనకూ సంబంధించిన బ్రిటిషు ప్రతిపాదనలను అంగీకరించారు. దేశంలో కెల్ల పెద్ద రాజకీయ పక్షమైన కాంగ్రెస్ మాత్రం శిరపరిష్కార ప్రతిపాదనలను అంగీకరించి తాత్కాలిక ప్రభుత్వస్థాపన ప్రతిపాదనల నిరాకరించింది.

ఈనిర్ణయములవల్ల భారతదేశ భావ్యస్వరూపమెలా ఉంటుంది? ప్రధాన సమస్యలలో చాలా అనుకూలమైన మార్పులు కలుగుతవని నా కనిపిస్తున్నది.

భారతీయ రాజ్యాంగవిధానమును నిర్ణయించవలసిన రాజ్యాంగపరిషత్తు ఆగస్టుమాసంలో సమావేశమౌతుంది. ఈ సమావేశం జరుగవలసిన అవసరానికి తగ్గట్టుగా మార్పు అవుతూ ఉంది. ప్రతినిధుల ఎన్నిక ప్రారంభం చేస్తున్నారు. కార్యవర్గసభ్యుల నియామకం జరిగింది. న్యాయశాస్త్రజ్ఞులు ఎన్నిక పూర్తియయింది. జూలై 6 వ తారీఖున ప్రాతినిధ్యశాసన సభ్యుల ఎన్నికలు ప్రారంభమవుతాయి. ఒకరుచొప్పున దాదాపు మూడువందల మంది ప్రతినిధులు, ముందు సమావేశమౌతారు. సంస్థానాలు నియమించే 93 మంది ప్రతినిధులు తరువాత చేరుతారు.

రాజ్యాంగపరిషత్తు సమావేశమైనపుడు ముందుగా ప్రతినిధులు ఒక అధ్యక్షుని ఎన్నుకుంటారు. వ్యవహారక్రమాన్ని నిర్ణయిస్తారు. ఈపని పూర్తికాగానే ప్రతినిధులు పథకంప్రకారం, గ్రూపురాజ్యాంగాన్ని తయారుచేసేటందులకు మూడువర్గములుగ విభాగమైపోతారు. ఈ వర్గ రాజ్యాంగపరిషత్తులు ప్రథమంగా చేసేపని విషయమై నేను అనేకమంది విజ్ఞుల విచారించాను. మతవిభాగాలపై ఆధారపడి ఉన్న ప్రత్యేక నియోజకవర్గాలను రద్దు చేయడమే ఈ పరిషత్తుల మొదటిపని అని అందరూ అన్నారు. ఇది జరిగితే భారత రాజకీయాలకు పట్టినపీడ వదలిపోతుంది. ముస్లిం ముస్లింకే వోటుచేయడం, హిందువు హిందువుకే వోటు చేయడం అనే ఈ పద్ధతిని బ్రిటిషువారీ దేశంలో 1909 వ సంవత్సరంలో ప్రవేశపెట్టారు. ఇందువల్ల రాజకీయశాంతి, ఆర్థిక, సాంఘిక అభివృద్ధి పూర్తిగా భగ్నమైపోయినవి. ఈ ప్రమాదకరమైన పద్ధతివల్ల జాతివిద్వేషాలు పెచ్చుపెరిగిపోవడమూ, మత విభేదాలు విజృంభించటమూ జరిగింది. విభజించి పాలించడం సామ్రాజ్యవాదపు సంప్రదాయ సిద్ధమైన వ్యవహారకౌశలం. ప్రత్యేకనియోజకవర్గాలందులో ఒక భాగమే. రాజకీయ ఎన్నికలనుండి మతసంబంధమైన లక్ష్యాలను తొలగించితే భారతైక్యతకు దోహదం చేసినట్లవుతుంది. సంఘర్షణ కారణాలను తొలగించినట్లవుతుంది. ఈఅవకాశం లభించింది. ఇది ఇప్పుడే ముగిసిన రాయబారాలు సాధించిన మహత్కార్యంగానే భావిస్తున్నాను. ఈ రాయబారాల ఫలితం జిన్నాకు, ముస్లిం లీగుకు పరాజయంగా పరిణమించింది. ముస్లింలీగు ఈ విషయమును గుర్తించింది. రాజ్యాంగపరిషత్తు ఎన్నికలను వాయిదా వేయవలసిందని కోరింది. బ్రిటిషువారీ కోరికను మన్నించలేదు.

* * *

హిందువులు, మహమ్మదీయులు...వీరెవరి విషయంలోనూ నా కెలాంటి అభిమానాలుగానీ, దురభిమానాలు గానీ లేవు. ఏమతవర్గం అన్నా నాకు ద్వేషంలేదు. కాని ముస్లింలీగు ప్రతీపశక్తుల కూటమి. రాజకీయంగాపూర్వాచారపరాయణులవర్గం. వీరిలోనుంచి ఒక్క జిన్నాగారిని మాత్రం మినహాయింపవచ్చును. అయన గొప్ప ధనికుడు. ప్రసిద్ధ న్యాయవాది. ఇక ముస్లిములీగు నాయకుల విషయం చూస్తే వారందరూ పెద్ద పెద్దభూస్వాములు. ముస్లింలలో అభ్యుదయ మార్గాన్ని అనుసరించేవారు భారతదేశములో లేకపోలేదు. కాని వారు ముస్లింలీగ్‌లో మాత్రం కన్పించరు. అసలు విషయం ఏమిటీ అంటే ఈ ముస్లింలీగ్ రాజకీయ రంగంలో వ్యవహారంచేస్తున్న మతసంస్థ. ఇందులో ముస్లింలకు తప్ప ఇతరులకు ప్రవేశంలేదు. కాంగ్రెస్ అలా కాదు. కాంగ్రెస్‌లో ఉన్నవారు అత్యధిక సంఖ్యాకులు హిందువులే అయినా ముస్లింలు సిక్కులు, నిమ్నజాతులవారూ, క్రైస్తవులు...అంతా ఉన్నారు. ఈ ఆరుబారు సంవత్సరాలుగా కాంగ్రెస్‌లో అగ్రస్థానాన్ని ఆక్రమించిన, మౌలానా అబుల్ కలాం ఆజాద్ ప్రఖ్యాత ముస్లింముస్లీ. అయన 'కేవలం తాళం' వేసేవాడని చెప్పేవారెవ్వరికీ ఆయన సంగతి తెలియదనే అనాలి. కాంగ్రెస్‌లో కోటీశ్వరులు, కుబేరులూ ఉన్నారు. దరిద్రులైన కుచేలురూ ఉన్నారు. పూర్వాచార పరాయణులూ, మితవాదులు, తీవ్రవాదులూ ఉన్నారు. కానిరాజకీయ కలాపానికి మత విషయాలను గీటురాయిగా చేయడానికి కాంగ్రెస్ ఒప్పుకోదు.

ఢిల్లీ రాయబారాలలో ముస్లింలీగ్‌పై కాంగ్రెస్ విజయాన్ని సాధించింది. భారతీయుల రాజకీయాభ్యుదయానికిది మంచిదనే నేననుకుంటున్నాను. అనేక సంవత్సరాలుగా బ్రిటిష్ పాలకులు జిన్నాకు మద్దస్తు ఇస్తూవచ్చారు. టోరీ సామ్రాజ్యవాదం వలసరాజ్యాలన్నింటిలోనూ టోరీ రాజకీయ వేత్తలతో చేతులుకలిపి వ్యవహారం సాగించింది. అంతకంటే సహజమైనది, ఇంకేముంటుంది? ఏకకంఠంగా ఆదరంతో చేరుతూ ఉంటారు. ఈ కారణంగానూ, మరికొన్ని ఇతర ముఖ్య కారణాలవల్ల కాంగ్రెస్ నిర్దోషి అనేందుకు వీలులేదు.

* * *

క్రిందటి ఏడెనిమిది సంవత్సరాల్లోనే జిన్నాగారి బలం పెరిగిపోయి బలం హెచ్చింది. బ్రిటిషు ప్రాపకంతో తనవారికి ఉద్యోగాలు సంపాదించి పెట్ట కలిగాడు. ఈ విధంగా ముస్లిం భూస్వాములు ఉద్యోగ వ్యామోహం గల మధ్యతరగతి ముస్లింలపై ప్రాపకం సంపాదింప కలిగాడు. కాని ముస్లింవర్గ తాంగానికి పీఠిమీద విశ్వాసం కలగలేదు. అందుకే జిన్నాగారు 1940 లో పాకిస్తాన్ లక్ష్యాన్ని ప్రకటించారు. ఈ విధంగా మత సంబంధాలను జాతీయ సంబంధాలతో కట్టుబెట్టం చేయాలనుకొన్నాడు. ఇది చాలా ప్రమాదకరమైన సమ్మేళనం. పాకిస్తాన్ సాధించాలనే ఉత్సాహంలో ముస్లిం వర్గతాంగం, భూస్వాముల కోసం సంగతి మర్చిపోతారని అనుకున్నారు. హిట్లర్ కూడా ఇలాగే చెప్పాడు. ధనికవర్గం పై కార్మికవర్గానికి గల ద్వేషభావాన్ని, పగను తొలగించివేయడానికి జాతీయాభిమానాన్ని ప్రకోపింపచేశాడు. "మనం అందరం జర్మన్‌జాతివారం" అని హిట్లర్ ఘోషించాడు. అలాగే "మనందరం ముస్లింలం" అని జిన్నాగారు ప్రకటించారు.

జిన్నాగారు పాకిస్తాన్ కావాలన్నారు. ఇవ్వకపోతే యుద్ధం చేస్తానన్నారు. బ్రిటిష్‌వారిచ్చిన బలాన్ని వారిమీదనే ప్రయోగించడానికి తయారైనారు. దబాయించి సాధించాలని ఆశించారు. ఈపరిస్థితి కొందరు టోరీలకు నచ్చలేదు. జిన్నాగారి కోరికను మన్నించపోతే భారతదేశం యావత్తూ రక్తసిక్తం అవుతుందని అమెరికాలో బ్రిటిషు ప్రచారకులు చెప్తూవచ్చారు. కాని ఈరోజు పరిస్థితి ఏమిటి? పాకిస్తాన్ ఆచరణయోగ్యం కాదని బ్రిటిష్‌మంత్రిత్రయం జిన్నాగారి కోరికను నిరాకరించింది. ఎలాంటి సముసుదూ లేక జిన్నాగారి ముస్లింలీగ్ తిరస్కారాన్ని దిగమ్రింగింది. సహకారం చేయడానికి సిద్ధంగా ఉన్నవారితో తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తామని బ్రిటిషువారు ప్రకటించారు. జిన్నాగారు సిద్ధంగా ఉన్నామన్నారు. కాంగ్రెసువారు ఒప్పుకోలేదు. చివరికి తాత్కాలికప్రభుత్వం ఏర్పాటుకాలేదు. బ్రిటిషువారు మాటతప్పారని జిన్నాగారు బహిరంగంగా నిందించారు. అయినా బ్రిటిషువారు చలించలేదు. ఉలుకలేదు పలుకలేదు. ఐనా జిన్నాగారు రణభేరి యేమీ మ్రోగించడంలేదు.

బ్రిటిష్‌వారినుండి సాధించిన విజయాలవల్లనే జిన్నాగారిని అంటిపట్టుకుని లీగర్లు ఇంతవరకూ ఉంటే ఇప్పుడు వారందరూ జారిపోవాలి,

తమ రుజువర్తనాన్ని గురించి భారతీయులను నమ్మించాలంటే స్వాతంత్ర్యం కోసం పనిచేస్తున్న కాంగ్రెస్‌తో రాజీపడాలిగాని, స్వాతంత్ర్యాన్ని కోరని అంగుకేమీ పనిచేయని లీగ్‌తో కాదని బ్రిటిషు కార్మిక ప్రభుత్వం గ్రహించింది.

ఇదీ ఇప్పటి ధోరణి. బ్రిటిషు విధానం ఇదేనని స్పష్టపడితే భవిష్యత్తు నిజంగా ఆశాజనకంగా ఉంటుంది.

భారతదేశం విషయమై బ్రిటన్ అభ్యుదయ మార్గాన్ని అనుసరించితే భారతీయులందరిలో నవోత్సాహం కలుగుతుంది. నవయుగానికీ, నవ్యభావాలకు, క్రొత్త నాయకత్వానికి భారతీయులు తయారవుతారు. కాని నవ్యభావాలను, క్రొత్త నాయకులను, అనేకచిక్కులు, లోపాలుతో కూడిన వర్గీకరణ ఎదుర్కొంటున్నట్లుగా ఎంచేతనో అనిపిస్తూఉంది. (కాపీరైట్)

## ఆహార ధాన్యాల దిగుమతి

1 పేజీ తరువాయి

ధాన్యమును అమెరికా ప్రభుత్వము పూర్తిగా సేకరింపజాలకపోయినది. మార్చిలోను ఏప్రెలులోను యొపర్యాప్తిగా సాగలేదు. ధాన్యాన్ని ప్రభుత్వమునకు అమ్మినవారికి అదనపు రేటు కొంత బోనసుగా యివ్వబడునని మే నెలలో ప్రకటించుటవల్ల దేశంలో పంటదారుల వద్ద అధికంగా నిల్వ ఉన్న ధాన్యం గూర్తూ సేకరించబడినది. అందువల్లనే మేనెలలో 20 వేల టన్నులు కాకుండా 69 వేల టన్నులను రవాణా చేయుటకు సాధ్యమైనది. గత మాసం అనగా జూనులో 85 వేల టన్నులను పంపగల్గిరి.

## కోర్టు జరిమానాల వాపసు

### మదరాసు ప్రభుత్వం ఉత్తరువు

మదరాసు, జూలై 4 : 1940-41 వ్యక్తిగత సత్యాగ్రహముసందు, 1941-43 శాసనోల్లంఘనోద్యమమునందు కోర్టులలో జరిమానా శిక్షలు విధింపబడినవారికి వసూలయిన జరిమానా మొత్తం వాపసు చేయుటకు ప్రభుత్వంవారు ఉత్తరువు చేసిరి అట్లా జరిమానా శిక్షవిధించబడి చెల్లించినవారు, జైలు నెంబరు కేసు నెంబరు, యితర వివరాలు తెల్పుచు జిల్లా కలెక్టరుకుగాని పోలీసు కమీషనరుకుగాని దరఖాస్తు లు పెట్టుకోవలెను.

# గౌ. డేనియల్ థామస్ గారికి

## గుంటూరు మునిసిపాలిటీ సన్మానము

గుంటూరు, జూన్ 30: గుంటూరు పురపాలక సంఘాధ్యక్షులు, సభ్యులు నిన్న సాయంకాలం పురపాలక సంఘపు ఆవరణలో స్థానికశాఖామంత్రి డేనియల్ థామస్ గారికి సన్మానంచేసి పురపాలకసంఘం తరఫున వినతిపత్రం సమర్పించారు. ఈ క్రిందివిషయాలు కోరబడినవి. (1) లేడీ హాస్పిటలు భవనం కట్టించుటకు ప్రభుత్వంవారు పురపాలక సంఘము అడిగిన అప్పు మంజూరు చేయుట, (2) సంగం, జాగర్లమూడి నీటిస్కీమును త్వరలో పూర్తిచేయుట, (3) మురికినీటిని తీసివేయు స్కీమును గూర్చి తగిన ప్లానులు తయారుచేయుట, (4) 1939 లో ప్రవేశపెట్టబడిన చట్టమును సవరించి ప్రజాప్రతినిధులకు ఎక్కువ హక్కులిచ్చుట.

మంత్రిగారు బదులుచెప్పుచు కాంగ్రెసు ప్రభుత్వం స్థానిక సంఘాల ప్రజాప్రతినిధులకు యెక్కువహక్కులివ్వగలరనియు, కాని ఆహక్కులను ప్రజాప్రతినిధులు దుర్వినియోగము చేయగూడదనియు తెలిపిరి. తమ ప్రతినిధులు ఎలాప్రవర్తిస్తున్నారో ప్రజలు జాగ్రత్తగా గమనించవలెనని కోరిరి. ప్రస్తుతము పురపాలక సంఘములలోనున్న ద్వంద్వపద్ధతి మార్చుటకు కాంగ్రెసు సంకల్పించిందని చెప్పిరి.

ఉన్నతోద్యోగులు సమర్పించిన వినతి పత్రమునకు బదులుచెప్పుచు, వారడిగిన విషయమునుగూర్చి ఆలోచించి, కరువు బత్తెము, తదితర విషయములనుగూర్చి తప్పక సహాయము చేస్తామని చెప్పిరి. వీరి జీతాలను పెంచుటకూడా అవసరమని చెప్పిరి. పాకీ వాండ్లకంటె గుమాస్తాల కుటుంబాలకు ఆదాయం తక్కువనీ, వారు చాలా అధోగతిలోనున్నారనీ చెప్పిరి. కాంగ్రెసు ప్రభుత్వంవారు ఆఫీసర్లకు-కష్టపడి పని చేయు గుమాస్తాలకు జీతములు అట్టే వ్యత్యాసములు లేకుండా ఉంచవలెనని ప్రయత్నిస్తున్నారని చెప్పిరి. ఎక్కువ పన్నులైనా వేసి, గుమాస్తాల జీతాలు పెంచవలెనని కాంగ్రెసు ప్రభుత్వంవారు తలుస్తున్నారనికూడా చెప్పిరి.

## పంచమోద్ధారక శ్రీ గోపాలరాయ వర్ధంతి

రాజమంద్రి, జూన్ 30: నిన్న సాయంకాలం విక్రమహాలులో జరిగిన పంచమోద్ధారక శ్రీ తల్లాప్రగడ గోపాలరాయ నాల్గవ వర్ధంతి ఉత్సవానికి గౌ॥ క. కోటిరెడ్డిగారు అధ్యక్షత వహించిరి. గోపాలరావునాయుడుగారు పంచముల అభివృద్ధికి చేసిన అఖండసేవను అధ్యక్షులుకొనియాడిరి. వారిని ఆదర్శంగా పెట్టుకొని, కులతత్వాన్ని రూపు మాపమని సభ్యులను హెచ్చరించిరి.

తరువాత గోపాలరాయ స్మారక సంఘ పక్షమున హరిజన కవులకు, సంగీత విద్వాంసులకు, చేతి పరిశ్రమల ప్రదర్శనములో పాల్గొనినవారికి శ్రీమతి క. రామసుబ్బమ్మగారు బహుమతులు పంచిపెట్టిరి.

# లంచగొండితనం, దొంగమార్కెటు నిర్మూలన

## డిటెక్టివ్‌ల, సూపర్‌డిటెక్టివ్‌ల నియామకం

చెన్నపురి, జూలై 4: లంచగొండితనం, దొంగమార్కెటు నిర్మూలనకు ప్రభుత్వము నియోగించే సిబ్బంది ఈ నెల మొదటి తేదీన చార్జీ తీసుకొని పనిలోకి రావలసి ఉండెను. కాని ఏర్పాట్లు పూర్తి కానందున మరికొన్ని రోజులు ఆలస్యమగునట్లు తెలియుచున్నది. వెన్వంటనే ఈ సిబ్బంది గట్టిగా పనికి పూనుకొను ఏర్పాటును గూర్చి ప్రధాని ప్రకాశం పంతులుగారు ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ పోలీసు దివాన్‌గారితో నిన్న రెండుగంటల సేపు చర్చించిరి.

ఈ సిబ్బంది మద్రాసు కేంద్రస్థానముగా పెట్టుకొని ఎక్కడికి పనిచేసే అక్కడికి వాలటానికి సిద్ధంగాఉంటారు. ఈ డిటెక్టివ్‌లు పని తిన్నగా చేస్తోందీ లేనిదీ చూడటానికి 'సూపర్ డిటెక్టివ్‌'లను కూడా నియమిస్తారని తెలుస్తోంది.

## మంత్రులకు విన్నపాలు

### హాస్పిటల చక్కెర పనివారు

మదరాసు, జూలై 2: హాస్పిటల ఇంజనీరు సుగరు రిఫైనరీస్ పనివారి సంఘం తరఫున లక్ష్మణమూర్తి మరి యిద్దరు నేడు కార్మికశాఖ మంత్రి గౌ॥ వి. వి. గిరిగారిని సందర్శించి, తమ సంఘంవారు యజమానులకిచ్చిన సమ్మెకట్టు నోటీసునుగూర్చి చెప్పుచు, ప్రభుత్వంవారు త్వరగ జోక్యం కలిగించుకొని, వారానికి 44 గం. పని నిర్ణయించి యితర విషయముల యిబ్బందులు తొలగించాలని విన్నవించిరి.

## కడపకు విద్యుచ్ఛక్తి

శ్రీ లంకదారి సత్యనారాయణ, కోదూరి పార్థసారథి, వి. వి. రామను, డి. కె. నాడే, పి. శేషయ్యశెట్టిగార్లు నేడు మంత్రి గిరిగారిని సందర్శించి, కడపలో ఒక థెర్మలు స్టేషను నిర్మించి విద్యుచ్ఛక్తి సరఫరా చేయించగోరిరి. అందువల్ల సుమారు 4 లక్షల ప్రజలకు పరిశ్రమల అభివృద్ధికి సాధించునని వివరిరి. లేకున్న మెట్టూరు స్కీము నుండైన రాజంపేట తాలూకావరకుగా ఎలక్ట్రిసిటి త్వరగ సప్లయిచేయమనికోరిరి.

## సమ్మెకట్టులు

నేడు బకింగుహాం కర్నాటిక మిల్సు వద్ద పికెటింగుచేయుచున్నవారు 11 గురు అరెస్టుచేయబడిరి.

పెరంబూరు రైల్వేవర్కుషాపునందు వారంపైగా జరుగుచున్న పనిలోనికిపోయి పనిచేయని సమ్మెకట్టుదారులతో సానుభూతి తెలుపుటకుగాను ఫీజిమెకానికలు ఇంజనీరు ఆఫీసు గుమాస్తాలుకూడా శనివారం సమ్మెకట్టిరి. మేనేజరుగారు నేడు 11 మంది సమ్మెదారుల ప్రతినిధులను సంప్రదించుటకు ఆహ్వానించిరి.

## బస్సుపనివారల సమ్మె

మదరాసు వేలూరు బస్సుపనివారలు నిన్న సమ్మె ప్రారంభించారు. మదరాసు నుండి వేలూరుకు నిన్న ఒకబస్సువెళ్లింది. అక్కడనుండి రావలసిన బస్సు మాత్రం రాలేదు.

## ఇంగ్లీషు 2 వ భాష

సెకండరీ పాఠశాలలందు ప్రాంతీయ భాషనే ప్రథమభాషగాను, ఇంగ్లీషుని రెండవభాషగాను (సెకండు లాంగ్వేజి) గను పేర్కొనుచు విద్యాశాఖనియమాలను సవరించవలసిందిగా మదరాసు విద్యాశాఖ మంత్రిగారు విద్యాశాఖ మంత్రిగారికి ఉత్తరువుచేసిరి.

# ఎల్. ఎం. పి. వైద్యుల సంఘం

అ. భా. మెడికలు లైసెన్సియేటుల స్థాయిసంఘసభ 28 వ తేదీన మదరాసులో జరిగినపుడు, అధ్యక్షులుగ డా॥ పి. బి. ఆనంగరాచారిగారు, ఉపాధ్యక్షులుగ జి. ఎల్. నారాయణస్వామినాయుడుగారు, రాష్ట్ర కార్యదర్శిగ డా॥ డి. వి. వెంకప్పగారు ఎన్నుకొనబడిరి. పూనాలో జరుగు అఖిల భారతసభకు అధ్యక్షులుగ డా॥ వెంకప్పగారు ఎన్నుకొనబడిరి.

## కొత్త హోటలు

మదరాసు, జూలై 1: తిరువల్లికేణి పల్లభ అగ్రహారం వీధిలో "నియోనూన సరోవర్" అనే కొత్త హోటలుముఖ్యంగా శాసనసభ్యుల భోజనవసతులకు గాను ప్రారంభింపబడినది. ఈహోటలు ప్రారంభోత్సవమును స్పీకరు శ్రీ జె. శివషణ్ముగంపిళ్లగారు జరిపారు. కౌన్సిలు అధ్యక్షుడు శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారు అధ్యక్షత వహించారు.

## డా॥ తిరుమూర్తిగారు

డా॥ టి. ఎస్. తిరుమూర్తిగారు దక్షిణాది భాషలలో శాస్త్రీయపదాల సమీకరణ సంఘం అధ్యక్షులుగ శ్రీ॥ శే॥ వి.ఎస్. శ్రీనివాసశాస్త్రిగారి స్థానే నియమింపబడిరి.

# ఆం॥ రా॥ కాంగ్రెసు కార్యవర్గ సమావేశం

## మదనపల్లి నియోజకవర్గానికి అభ్యర్థి నియామకం

[ఆంధ్రపత్రికా విలేఖరి]

బెజవాడ, జూలై 4: ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గం శ్రీ యన్. జి. రంగాగారి అధ్యక్షతను నిన్న నిక్కడ కాంగ్రెస్ కార్యాలయంలో సమావేశమైంది. టి. యన్. రామకృష్ణారెడ్డిగారి మరణంవల్ల మదనపల్లి నియోజకవర్గంనుండి రాష్ట్ర అసెంబ్లీకి ఏర్పడిన ఖాళీకి అభ్యర్థిని నియమించడంగురించి కమిటీవారు విచారించారు. పదముగ్గురు దరఖాస్తులు పంపారు. జి. వి. పాపన్నగుప్తా, పి. తిమ్మారెడ్డిగార్లకే పోటీఉందనీ, వీరిలో తిమ్మారెడ్డిగారికే ఎక్కువ అవకాశాలున్నాయని తెలుస్తుంది. పి. తిమ్మారెడ్డిగారు రైతువర్గానికి చెందిన వారవుటవల్ల వారికే కార్యవర్గం నిర్ణయించవచ్చునని రూఢిగా తెలుస్తున్నది. ప్రస్తుత రాష్ట్ర కాంగ్రెసువారు గత మాసం నిడుబ్రోలులో సమావేశమై కాంగ్రెసు విధానాన్ని నిర్ణయిస్తూ కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్యమే తమ లక్ష్యంగా పేర్కొని యున్నారు. తిమ్మారెడ్డిగారి నియామకం ఈ విధానానికి అనుగుణంగా ఉంటుందని భావిస్తున్నారు.

లోగడ ఈప్రకారంగానే చంద్రగిరి నియోజకవర్గానికి వెంకట్రామానాయుడు గారిని రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గంవారు నియమిస్తే హైకమాండ్ వారు దీన్ని తీసివేసి తాతాచారిగారిని నియమించి యున్నారు. ఈసందర్భంలో ఇక్కడ ఒక సంగతి తెలియవస్తున్నది. రాష్ట్ర కార్యవర్గం నిడుబ్రోలు సమావేశంలో రామానాయుడుగారి విషయమై కార్యవర్గంవారు ఏకగ్రీవ తీర్మానాన్ని తిరస్కరించినందుకు ఆక్షేపణ తెలుపుతూ తీర్మానం చేశారట. డా॥ పట్టాభిసీతారామయ్యగారు ప్రస్తుత కార్యవర్గానికి ప్రతికూలురనీ, క్రిందటి దఫా కార్యవర్గ సిఫార్సును తిరస్కరించడానికి వీరే కారణం అనీ తామ భిప్రాయపడుచున్నామనీ, కనుక ఆంధ్రదేశానికి సంబంధించిన విషయాలు పార్లమెంటరీ బోర్డులో చర్చకు వచ్చినప్పుడు పట్టాభిగారిని బోర్డునుండి తొలగించవలసిందనీ కార్యవర్గంవారు ఆ తీర్మానంలో సర్దార్ పటేలును, మౌలానా ఆజాదును కోరినట్లు కూడా తెలుస్తున్నది.

నిన్నటి సమావేశానికి 19 మంది సభ్యులలో 16 గురు సభ్యులు హాజరైనారు.

కార్యవర్గసమావేశం నిన్న సాయంకాలం ముగిసింది. మదనపల్లి నియోజకవర్గానికి పి. తిమ్మారెడ్డిగారినే నియమించినట్లు ఖాయంగా తెలుస్తున్నది.

రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు ఆచార్య రంగాగారు ఈ ఉదయం సికింద్రాబాదు మీదుగా బొంబయికి వెళ్లారు.

## గౌ॥ కూర్మయ్యగారి నెల్లూరు సంచారం

గౌ॥ మంత్రి కూర్మయ్యగారు 5 వ తేదీన కారులో మదరాసు విడచి వెంకటగిరి పోయెదరు. 6 వ తేదీ అల్లూరిపాడు, నాగవోలు, బంగారుపేట, మున్నగు గ్రామాలు చూచుకొని రాత్రి తిరిగివెంకటగిరి వచ్చి, 7 వ తేదీ పల్లిపాడుపోయి అచట 5 వ ఆంధ్రరాష్ట్ర వ్యవసాయ కార్మికసభకు హాజరయి, మధ్యాహ్నం నెల్లూరులో నుండి, 8 ఉదయానికి మదరాసు వత్తురు.

గౌ॥ కళావెంకటరావు 7 వ తేదీన నెల్లూరులో ఆదివాసి సభయందు పాల్గొందురు.

విద్యాశాఖమంత్రి అవినాశిలింగంగారు 4 రాత్రి బొంబాయికి పయనమై, 8 రాత్రి గుంటకలు వచ్చి, 9 ఉదయం అచట హైస్కూలు శంకుస్థాపనోత్సవం జరిపి, సాయంకాలం అనంతపురంలో ఇంజనీరింగు కాలేజీ మందిరాలు చూసెదరు. సాయంకాలం దత్తమండలాల కాలేజీయందు గాంధిమహాస్మృతి పటం తెరచెదరు.

## 1941 ఉద్యమ శిక్షితులగు గ్రామోద్యోగులు

1941-42 జాతీయోద్యమంలో తీసివేయబడిన గ్రామోద్యోగులు తిరిగి పనులకై జిల్లాకలెక్టరులకు దరఖాస్తులు పెట్టుకొనవచ్చునని ప్రభుత్వంవారు ఉత్తరువు చేసిరి.

## ఉద్యోగుల మార్పు

ఎ. డి. వి. రెడ్డిగారు జిల్లా మునసబుగ నియమింపబడిరి.

జి. కొండయ్యగారు, తూ. గోదావరి జిల్లా స్పెషలు డిప్టీ కలెక్టరుగ నియమింపబడిరి.

కమాండెంటు ఎం. కెంపులుగారు రిటైర్మెంటు అయిన పిదప సెలవులు అసిస్టెంటుగను, కె. సుబ్రహ్మణ్యరావుగారు అనంతపురంలో, కె. గోపాలుగారు ఉత్తర ఆర్కాడులో జిల్లా రిజిస్ట్రారులుగ నియమింపబడిరి.

## సర్వేంద్ర సాహిత్యసభ

చెన్నపురి ఆంధ్రమహాసభ హాలులో శ్రీ శ్రీనివాస శిరోమణిగారి అధ్యక్షతను 3 వ తేదీ సర్వాంధ్ర సాహిత్యసభ జరిగింది. ఆంధ్రప్రభ సంపాదకులు నార్ల వెంకటేశ్వరరావుగారు, చల్లా జగన్నాథంగారు, కోరి రాజేశ్వరరావు, పి. శ్రీరాములు, మద్దాలి సత్యనారాయణ శర్మగారలు మున్నగు ప్రముఖులు సభకు విచ్చేశారు. శ్రీ రంగం నారాయణబాబుగారు సర్వాంధ్ర సాహిత్యధోరణులను వివరించి చెప్పి ఉమామహేశ్వరరావుగారి ప్రత్యేకతను గూర్చి చెప్పారు. జీరాజు కృష్ణశర్మగారు ప్రాచ్యవిదం, ఇమేజిజం, మున్నగు ఇజాలను ఉమామహేశ్వరరావుగారు ఆంధ్ర సాహిత్యంలో తొలిగా ప్రస్ఫుటించిన విషయాలను వివరించారు. సదస్సుల కోరికపై ఉమామహేశ్వరరావుగారు తమరచనలను గానంచేశారు.



Edited Printed, & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras.